
సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **ద్వారకాదీష్ వాస్తు** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **ద్వారకాదీష్ వాస్తు** వారి వెబ్ సైట్: http://dwarkadheeshvastu.com
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో **ద్వారకాదీష్ వాస్తు** వెబ్ సైట్ వారు అందించటం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు వారికి గలవు,కనుక వారిని సంప్రదించగలరు.

**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## ద్వారకాదీష్ వాస్తు వారి వెబ్ సైట్:

## http://dwarkadheeshvastu.com



# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# అష్టాదశ పురాణములు

## స్కాంద పురాణము

పూర్వము కైలాస పర్వతము మీద శంకరుడు బ్రహ్మాది దేవతలలో కొలవై యుండి, యీ స్కాందపురాణమును వారికి వినిపించెను. పార్వతి అది విని కుమారస్వామికి (స్కందునకు) చెప్పెను. ఆయన నంది గణమునకు చెప్పెను. నంది దత్తాత్రేయునకు జెప్పెను. ఆయన వ్యాసునకు జెప్పెను. వ్యాసుడు దానిని సూతునకు జెప్పెను. ఆయన శౌనకాది మునులకు జెప్పెను.తత్పురుష కల్పములో, సర్వసిద్ధులను సమకూర్చెడి మాహేశ్వర ధర్మములు కుమారస్వామిచే లోకానుగ్రహ బుద్ధితో చెప్పబడినది. అవి అన్నియు ఒక పురాణమై వెలసినవి. స్కందునిచే చెప్పబడిన పురాణము కావున ఇది స్కాంద పురాణ మని ప్రసిద్ధి కెక్కెను.

**చంద్రాంగదుడు - సోమవార వ్రతము**

నలదమయంతుల కుమారుడు ఇంద్రసేనుడు. అతనికి చంద్రాంగదుడను కుమారు డుండెను. అతడు సమస్త విద్యాకుశలుడై యువరాజ్య పట్టాభిషిక్తు డయ్యెను. అతనికి చిత్రకర్ముడను రాజు తన కుమార్తె సీమంతిని నిచ్చి పెండ్లి చేసెను. చంద్రాంగదుడు అత్తవారింట్లో కొన్నాళ్ళుండెను. ఒకనాడు యమునానదిలో నౌకావిహారము చేయుటకై మిత్రులతో వెళ్ళెను. పెద్దగాలి విసరి పడవ తిరుగబడి అందరును నీళ్ళ పాలైరి. చిత్రకర్ముడుచంద్రాంగదునికై వెదకించెను. లాభము లేకపోయినది. విచారముతో ఇంటికి బోయి, కుమార్తెకు అలంకారము లన్నియు తీసివేసెను. ఆమె వితంతు వేషముతో నుండెను. ఆమెను జూచి మైత్రేయి అను మునిపత్ని, "పరమశివుని ఉద్దేశించి సోమవార వ్రతమును దీక్షతో చేయుము. నీకు శుభములు గలుగు"నని బోధించి, ఆమెకా వ్రతము చేయు విధానము చెప్పి వెళ్ళెను. ఆమె ఆ సోమవార వ్రతము చేయనారంభించెను. (సోమః ఉమయాసహితః శివః (పార్వతితో గూడిన శివుని సోము డందురు. అతనికి ఇష్ట మైనది సోమవారము. ఆనాడు అతనికి గూర్చిచేయు వ్రతము). చంద్రాంగదుడు నీటిలో మునిగి నాగలోకము చేరెను. ఇతనిని తెచ్చిన నాగకన్యలు తక్షకు నెదుట నిలువబెట్టిరి. తక్షకు డతనిని జూచి "నీ వెవరి కుమారుడువు?ఎందుకీ లోకమునకు వచ్చితివి?"అని యడుగగా, రాజకుమారుడు, తాను నిషధదేశాధిపతియైన నలుని పౌత్రుడ ననియు యమునలో నౌకవిహారము చేయుచు ప్రమాద వశమున నీటిలో మునిగి యీ లోకమునకు వచ్చితి ననియు, తక్షకునివంటి మహాత్ముని దర్శనము వలన ధన్యుడనైతి ననియు తన కథ వినిపించెను.

తక్షకుడు అతని వినయ విధేయతలకు ఆనందించి తన యింట కొన్నాళ్ళుండుమనెను. చంద్రాంగదుడు,"ఇప్పటికేనావారందరును నన్ను చచ్చినవారిలో లెక్కవేసి యుందురు. నేను వెళ్ళి నా తల్లిదండ్రులకును, నా భార్యకును, అత్తమామలకును సంతోషము గలిగింపవలెను. కావున త్వరలో నాకు సెలవిచ్చి నా లోకమునకు పంపు"డని కోరెను. ఆయన అనేకములైన కానుక లిచ్చి, అవి మోయుటకు ఒక రాక్షసుని, మిత్రుడుగా ఒక నాగయువకుని తోడిచ్చి పంపెను.ఈతదంగముజరుగులోపల,భూలోకములోమూడేండ్లు గడచెను. ఈలోగా ఇతని తండ్రిని శత్రువులు చెరలో బెట్టి రాజ్య మాక్రమించిరి.

చంద్రాంగదుడు యమునా తీరమునకు వచ్చెను. అతని భార్య వితంతు వేషముతో శివాలయమునకువచ్చెను.ఆమెను జూచి యెక్కడో చూచినట్లున్న దనుకొని "నీ వెవరు? ఇట్లుండుటకు కారణ మే"మనగా ఆమె, తన వృత్తాంతము చెప్పెను. ఆమె తన భార్యయని తెలిసికొని, "నీ భర్త మూడు నాలుగు రోజులలో వచ్చును. నే నాతని మిత్రుడను"అని చెప్పి తన పురమునకువెళ్ళికోటముందునిలబడి,శత్రురాజులనుద్దేశించి "మీకు ప్రాణముల మీద ఆశ యున్నచో ఉన్నపాటున నగరము విడిచిపొండు. నేను నలుని మనుమడను. చంద్రాంగదుడను. తక్షకుని వల్ల వరములు పొంది వచ్చినాడను. నా మాటలు లెక్కచేయనిచో మిమ్ము నా బాణాగ్నిలో భస్మము చేసెద"ననిచెప్పెను. శత్రురాజు వచ్చిచూచి, రాజకుమారుని ధైర్యసాహస పరాక్రమాదులకు భయపడి, అతని రాజ్యమునువిడిచివెళ్ళిపోయెను. చంద్రాంగదుడు తల్లిదండ్రులను చెరనుండి విడిపించి, తన కథను వినిపించెను. ఇంద్రసేనుడు తన వియ్యంకునకు చంద్రాంగదుడు క్షేమముగా వచ్చినాడని వార్త నంపెను. అతడు బ్రహ్మానందము నొంది కుమార్తెతో, "తల్లీ!నీవు చేసిన సోమవారవ్రతము ఫలించినది. నీ భర్త తిరిగి వచ్చినాడు"అని చంద్రాంగదుని తీసికొని వచ్చి తన కూతును మరల పెండ్లికూతును జేసి చంద్రాంగదుని కిచ్చి మహావైభవముతో పెండ్లిచేసెను. అతడు సీమంతినితో గలసి సోమవారవ్రతము నియమముగా జేయుచు పదివేలేండ్లు రాజ్యపాలన చేసి శంకరుని అనుగ్రహమును బొందెను.

**సోమవార వ్రతమహిమ**

విదర్భ దేశములో వేదమిత్రుడు, సారస్వతుడు అను బ్రాహ్మణు లిద్దరుండిరి. వారు ప్రాణమిత్రులు. వేదమిత్రుని కొడుకు సుమేధుడు. సారస్వతుని కొడుకు సామవంతుడు. వీరిద్దరు గూడ మిత్రులై ఒకే గురువు దగ్గర సమస్తవిద్యలును అభ్యసించి పండితులైరి.

వారికి వివాహయోగ్యమైన వయసు వచ్చెను. వేదమిత్ర సారస్వతులు ధనవంతులు కారు. అందుచేత కొడుకులతో "మీ పాండిత్యములతో ఈ దేశపు రాజును మెప్పించి ధనము సంపాదించుకొని రండు"అని పంపిరి. వారు వెళ్ళి రాజదర్శనము చేసి, తమ పాండిత్యప్రకర్షను ప్రదర్శించిరి. ఆ రాజు మీ కేమి కావలెనని యడిగెను. వివాహము చేసికొని సంసారము గడుపుకొనవలెను గాన, మా విద్వత్తును మెచ్చుకొన్నచో తగిన బహుమాన మిప్పింపుడని వారడిగిరి. రాజునకు, రాకూడని ఒక కొంటె ఆలోచన వచ్చెను. "మీలో ఒకరు ఆడు వేషము వేసికొని, మీరు భార్యా భర్తలవలె నటించుచు, నిషధరాజైనచంద్రాంగదునియొద్దకువెళ్ళుడు.ఆయనభార్యసీమంతిని మహాశివభర్తురాలు. సోమవారమునాడు వ్రతము చేయుచు దంపతీపూజ చేసి అపరిమితమైన ధనములను కానుకగా నిచ్చును. వెళ్ళి తెచ్చికొనుడు. మీ దారిద్య్రము తీరిపోవు"ననెను. వారు కపటకృత్యమునకుభయపడుచుండగా"ఇదిరాజాజ్ఞ.తప్పకపాలింపవలసినదే. పొండు"అని అంతఃపుర పరిచారికలను బిలిచి సామవంతునికి ఆడువేషము వేయించి పంపెను.

వారు సంకోచించుచునే చంద్రాంగదుని భార్య చేయు వ్రతమునకు దంపతులుగా వెళ్ళిరి. ఆమె వీరిని జూజి, నిజము గ్రహించి నవ్వుకొని, పీఠముపై కూర్చుండబెట్టి పార్వతీ పరమేశ్వరులుగా భావన చేసి సమస్తోపచారములతో యథావిధిగా పూజించెను. షడ్రసోపేతమైన విందు చేసి అపారమైన ధనములను దక్షిణగా నిచ్చి సాగనంపెను.

వారి తిరిగి వచ్చుచుండగా దారిలో సామవంతుడు సుమేధునితో ప్రణయ సంభాషణ మొదలుపెట్టెను. సుమేధుడు, "ఏమిరా!నిజముగా ఆడుదానివలె మాట్లాడుచున్నా వేమి? నీవు మగవాడవు. అది గుర్తుంచుకొని మసలుము"అనగా సామవంతుడు "నేను ఇప్పుడుమగవాడనుగాను.స్త్రీనైపోతిని.నీవునాకు నచ్చినావు. నాతో విహరింపు"మనెను. సుమేధు డాశ్చర్యపడి ఆమెను నిశితముగా చూచెను. సామవంతుడు నిజముగా స్త్రీ మయ్యెను. సుమేధుడు "నీవు నిజముగా స్త్రీ వైనచో, నీ తండ్రి నాకు నిన్నిచ్చినచో మనము దంపతుల మగుదము. పోవుదము రమ్మ"ని ఇంటికి దెచ్చెను. విషయము తెలిసి వేదమిత్ర సారస్వతు లాశ్చర్యపడిరి. సారస్వతుడు తన ఏకైక కుమారుడు స్త్రీ యైనందుకు విచారించుచు రాజువద్దకు బోయి, "నీ ధూర్తత్వము వలన నా కొడుకు స్త్రీగా మారినాడు.నాకు వంశాభివృద్ధి చేయు కుమారుని నీ విట్లు చేసినావు. రాజుల కిట్టి పరాచికములు తగునా?"యని పలికెను.

# అష్టాదశ పురాణములు

## స్కాంద పురాణము

రాజు, అతడు నిజముగా స్త్రీగా మారెనని తెలిసికొని, సోమవారవ్రత మాహాత్మ్యమును గ్రహింపలేక తాను చేసిన శివాపరాధమునకు పశ్చాత్తాపము నొంది, వీ రందరితో గలిసి దేవి యాలయమునకు వెళ్ళి నియమముతో నిరాహారుడై మూడు దినములు జగన్మాత నారాధించెను. దేవి ప్రత్యక్షము కాగా, రాజు ఆమెకు సాష్టాంగ ప్రణామము చేసి తన యపరాధమును మన్నింపుమని ప్రార్థించి, "తల్లీ!ఈ స్త్రీగా మారిన యువకుని మరల పురుషునిగా జేయు"మని యడిగెను. ఆ తల్లి, "రాజా!నా భక్తురాలి భావనను మార్చు శక్తి నాకు లేదు. ఈమె సుమేధునికి భార్య యగును. సారస్వతునికి వంశోద్ధారకుడైన కుమారుడుకలుగును"అనివరములిచ్చెను.జగన్మాత చెప్పినట్లు సామవతిని సుమేధునికి కిచ్చి సారస్వతుడు పెండ్లి చేసెను. అతనికి తరువాత ఒక కొడుకు పుట్టెను. వారు పరమ సంతోషభరితులైరి.

**భద్రాయుపు చరిత్ర**

పూర్వ మవంతిదేశములో ఒక బ్రాహ్మణ డుండెను. అతడు కులధర్మమును విడిచి వేశ్యాలోలుడై యుండెను. ఒకనాడా వేశ్యయింటికి ఋషభుడను శివయోగి వచ్చెను. వేశ్యయు బ్రాహ్మణుడును ఆయనకు పరమభక్తితో సేవలు చేసి, పిండివంటలతో భోజనముపెట్టిపరిచర్యలుచేసిరి.ఆయన వారిని దీవించి వెళ్ళిపోయెను. కాలాంతరమున బ్రాహ్మణుడు మరణించి దశార్ణదేశరాజు భార్య కడుపున బడెను. ఆమె సవతులు ఆమెకు విషము పెట్టిరి. కాని ఆమె చావలేదు. నెలలు నిండగానే ఆమె కొడుకును గనెను. విషప్రభావముచే ఆ తల్లి కొడుకుల దేహములనిండి వ్రణములు పుట్టి పెద్ద వయ్యెను. రాజు ఎన్నో చికిత్సలు చేయించెను. కాని తగ్గలేదు. రాజు విసిగిపోయి తల్లి కొడుకులను అడవిలో విడిచి పెట్టించెను. ఆ సమీపనగరములో సంపన్నుడైన పద్మాకరుడను వైశ్యుడు ఉండెను. అతని యింటిలోని దాసి ఒకతె వీరిని జూచి తన యజమాని దగ్గరకు తీసికొనిపోయి, వారికి రక్షణ కల్పింపుమని ప్రార్థించెను. అతడు అంగీకరించి తన యింట నుంచుకొని చికిత్స చేయించుచుండెను. ఒకనాడు వ్రణముల బాధతో రాకుమారుడు మరణించెను. రాజపత్ని యేడ్చుచుండగా శివయోగి ఋషభుడు వారింటికి వచ్చెను. అతడు రాజపత్ని నోదార్చినను ఆమె శాంతింపలేదు. అపుడా యోగి భస్మము నా బాలునిపై చల్లి బ్రతికించెను. తరువాత భస్మ మంటిన చేతితో ఆ మాతాపుత్రుల శరీరములను తాకెను. వారు వ్రణములు పోయి ఆరోగ్యవంతులైరి.

# అష్టాదశ పురాణములు

## స్కాంద పురాణము

పద్మాకరుని కొక కుమారుడు గలడు. అతడును రాకుమారుడును ప్రాణస్నేహితులై మెలగుచు, గురువుల యొద్ద తమ తమ కులములకు దగిన విద్యలు శ్రద్ధాభక్తులతో అభ్యసించిరి. ఒకనాడు ఋషభుడా రాకుమారుని యొద్దకు వచ్చెను. అతడు చదివిన చదువులను పరీక్షించి తెలిసికొని, "నాయనా!నీకు శివారాధనము చేయు విధానమును, శివకవచమును బోధించెదను. వానితో శంకరుని ఆరాధింపుము. నీకు సర్వత్ర జయము కలుగును"అనిధనుర్బాణములను, ఖడ్గమును ఇచ్చెను. భద్రాయువు (రాజకుమారుడు) నియమనిష్ఠలతోపరమేశ్వరునారాధించెను.శివానుగ్రహమువలనఅపూర్వశక్తులు లభించెను. ఇంతలో దశార్ణదేశరాజైన వజ్రబాహునిపై మాగధులు దండెత్తి ఓడించి బంధించి, రాజ్యము నాక్రమించిరి. ఆ సంగతి తెలిసికొని భద్రాయువుపద్మాకరునిఅనుమతితీసికొని వెళ్ళిఏకాంగవీరుడైమాగధులను రణమునకు బిలిచి తన పరాక్రమముతో విజృంభించెను. శివకవచ ప్రభావమువలన శత్రువులు ప్రయోగించిన అస్త్రశస్త్రములు ఇతని శరీరమును తాకి విఫల మయ్యెను. ఇతడు వారి నందరను సంహరించి శత్రురాజును బంధించి, సింహాసనము నాక్రమించెను. వెంటనే చెరసాలలో నున్న తల్లిదండ్రులను విడిపించి, ఆ సింహాసనముపై తండ్రిని కూర్చుండబెట్టెను. వజ్రబాహుడు "నాయనా!నీ వెవరవో నాకు తెలియదు. కాని, నాకు చేసిన మహోపకారమునకు నేనును, నా రాజ్యములోని ప్రజలును ఋణపడి యున్నాము"అని పలుకుచుండగా శివయోగి అచ్చటికి వచ్చి, "రాజా!రోగగ్రస్తులని పూర్వము నీ వడవిలో విడిచినావే, నీ భార్యాపుత్రులను!ఆ పుత్రుడే ఇతడు. నీ భార్య ఉత్తముడైన పద్మాకరుని రక్షణలో నున్నది"అని చెప్పగా రాజు మహానందముతో కొడుకును గౌగిలించుకొనెను. రాణిని కూడ పిలిపించి వారితో సుఖముగానుండెను.చంద్రాంగదుడనురాజుభద్రాయువుగుణగణములనువినియుండెను. శివయోగి చంద్రాంగదునితో నీ కుమార్తె కీర్తిమాలినికి యోగ్యుడైన వరుడతడే కావున అతని కిచ్చి వివాహము చేయుము"అని చెప్పెను. పూర్వజన్మములో వేశ్యయై యుండి కూడ శివయోగిని సేవించిన పుణ్యమువలన చంద్రాంగదున కామె కుమార్తెగా పుట్టెను. ఆ సంగతి తెలిసియే శివయోగి వారిద్దరినికిని పెండ్లి జరిపించెను.భద్రాయువు రాజ్యమునకు వచ్చెను. ప్రజలను కన్న తండ్రి వలె పాలించుచుండెను. ఒకనాడు భార్య కీర్తిమాలినితో గలిసి అరణ్యమునందు విహరించుటకు వెళ్ళెను. అక్కడ ఒక బ్రాహ్మణ మిథునము వచ్చి రాజును దర్శించి వెళ్ళుచుండెను.

వారిని ఒక పెద్దపులి తరుముకొని వచ్చెను. వారు భయముతో ఆర్తనాదములు చేసిరి. భద్రాయువు పరుగెత్తి పోయి ఆ పులిని బాణములతో గొట్టెను. అది చలించలేదు. వివిధ శస్త్రాస్త్రములు ప్రయోగించెను గాని అవి పులి నేమియు చేయలేకపోయినవి. పులి వచ్చి బ్రాహ్మణ స్త్రీని బట్టుకొని చంపి తినివేసెను. బ్రాహ్మణుడు గోలుగోలుననేడ్చుచు, "రాజా!నీవు ప్రజలను కాపాడ లేకపోతివి. నీ రాజరిక మెందుకు?ఇప్పుడు నా భార్య పులి నోటబడి మరణించినది. నాకు యజ్ఞాగ్ని హోత్రాదులు సాగుట యెట్లు?అందుచేత నీభార్యనునాకిచ్చిపొమ్ము" అనెను.రాజుఆశ్చర్యపడి,"ఓయి బ్రాహ్మణా!నీవు ధర్మములు తెలిసినవాడవు. పరుని భార్యను కోరవచ్చునా?" అని యడుగగా అతడా మాటలు వినిపించుకొనక యేడ్చుచుండెను. అపుడు రాజు, "దుఃఖములో నున్న బ్రాహ్మణుని ప్రాణము లిచ్చి యైనను శాంతింపజేయవలెను. ఈయన నా భార్య నడుగుచున్నాడు. ఇచ్చి ఇతని దుఃఖమును బోగొట్టెదను" అని నిశ్చయించుకొని "ఓ భూసురా!ఇదిగో నీవు కోరినట్లే నా భార్యను నీకు దాన మిచ్చుచున్నాను. గ్రహింపు"మని దానధార నతని చేతిలో విడిచెను. వెంటనే ఆ బ్రాహ్మణుడు గజచర్మముతోను, సర్పాభరణములతోను, చంద్రరేఖతోను,జటాజూటముతోనుపరమశివుడుగాప్రత్యక్షమై,"ఓరాజా!నీభూతదయను పరీక్షించుటకై నేనే బ్రాహ్మణరూపమున వచ్చితిని. పులినోట బడిన స్త్రీ పార్వతి. పులి యన్నదినామాయావిలాసము.నీత్యాగబుద్ధికిసంతోషించినాను. కావలసిన వరములు కోరుకొనుము" అని పలుకగా రాజు ఆయనకు సాష్టాంగదండ ప్రణామములు చేసి భక్తితో స్తుతించి,"పరమేశ్వరా!నీదర్శనము కలుగుటచే నేను ధన్యుడనైతిని. నన్ను, నా భార్యను నా తల్లిదండ్రులను, నన్ను పెంచిన పద్మాకర దంపతులను గూడ నీ గణములలో జేర్చుకొని సర్వదా నీ సాన్నిధ్యభాగ్యమును మాకు ప్రసాదింపుము" అని వేడుకొనెను. మాలిని వచ్చి నమస్కరించి, "దేవదేవా!నా తల్లిదండ్రులకు కూడ నీ సాన్నిధ్యమును ప్రసాదింపు"మనెను. పరమేశ్వరుడు వారికా వరము లిచ్చి యదృశ్యుడయ్యెను.

**రుద్రాధ్యాయ (నమక) మహిమ**

రుద్రాధ్యాయమనగాశివునివిశ్వరూపమునువర్ణించుమంత్రభాగము.దీనికేనమకమనియు, శతరుద్రియమనియు పేరులుగలవు.సంప్రదాయజ్ఞులునమకము,చమకము,పురుషసూక్తము మున్నగు మంత్రములతో శివునికి ఒకసారి కాని, మూడుసారులుగాని, ఐదుసారులుగాని, ఏడుసారులుగాని,తొమ్మిదిసారులుగాని,పదునొక్కసారులుగానియభిషేకము చేయుదురు.

# అష్టాదశ పురాణములు

## స్కాంద పురాణము

ఈ నమకమును బ్రహ్మ తన దక్షిణ ముఖమునుండి యజుర్వేదముతో సహా ఉచ్చరించెను. ఇది సకలోపనిషత్తులకును సారభూతమైనది. మరీచి మున్నగు మహర్షు లందరును దీని నధ్యయనము చేసినారు.

శ్లో॥ ఏష ఏవ పరోమంత్రః ఏష ఏవ పరం తపః

రుద్రాధ్యాయజపః పుంసాం పరం కైవల్యసాధనమ్॥

ఈ రుద్రాధ్యాయము సర్వోత్తమమైన మంత్రము. ఇదియే గొప్ప తపము. ఇది జపించుట కేవల ముక్తి సాధనము. కామక్రోధలోభాది షడ్వర్గములను నాశన మొనర్చి కైవల్యమును ప్రసాదించును. నమక పారాయణమును, రుద్రాభిషేకమును చేయు వారి జోలికి మేము పోలేమని యమభటులు యమునితో విన్నవించుకొనిరి. రుద్రాభిషేకము చేయువారికి అన్నవస్త్రములకును, ఐశ్వర్యములకును లోపము ఎప్పుడును కలుగదు. సర్వత్ర విజయము లభించును. ఆయువు, ఆరోగ్యము లభించును.

శ్లో॥ " రుద్రాధ్యాయీ వసే ద్యత్ర గ్రామే వా నగరేపి వా।

న తత్ర క్షుత్పిపాసాద్యా దుర్భిక్ష వ్యాధయో పిచ ॥

తా॥ ఒక్క రుద్రపారాయణపరుడు గ్రామమునగాని, నగరమునగాని నివసించుచున్నచో అక్కడ ఆకలిదప్పులు గాని, కరవుకాటకములుగాని, వ్యాధులుగాని ఉండవు. ("ఆకలిదప్పు లుండవు"అనగా అన్నోదకములకు లోపము కలుగదని యర్థము).

వింధ్యపర్వతము - అగస్త్యుడు

ఒకప్పుడు నారదుడు ఓంకారక్షేత్రమును దర్శించి మార్గవశమున వింధ్యపర్వతము దగ్గరకు వచ్చెను. నారదుని జూచి వింధ్యము మానవరూపముతో ఎదురువచ్చి స్వాగతము పలికి తన నివాసమునకు గొనిపోయి, దధి, మధు, ఆజ్య, నీర, ఆర్ద్రాక్షత, దూర్వ, కుశ, ప్రసూనములతోఅష్టార్ఘ్యములొసంగి పూజించెను. విశ్రాంతి తీసికొనుచున్న నారదునికి పాదము లొత్తుచు "మీరు వచ్చుటచే నా యిల్లు పవిత్రమైనది. కుల పర్వతములలో మాన్యుడ నైతిని. మీ రన్యథా భావించనిచో ఒక మాట చెప్పెదను. మేరు ప్రముఖ పర్వతాలకు భూమిని ధరించు సామర్థ్య మున్నదని పెద్ద లందురు.నేనును భూమిని భరించుచున్నాను. పార్వతీ జననము చేతను, శివునికి మాయ యగుట చేతను హిమవంతుడు పర్వతాలకు రాజైనాడు. సరియే. మరి, బంగారముతోను,రత్నములతోను నిండి యున్నంతమాత్రమున మేరుపర్వతము గొప్ప దగునా?

# అష్టాదశ పురాణములు

## స్కాంద పురాణము

ఉదయపర్వతమును చూతమా, మందేహ రాక్షసులతో నిండిపోయినది, అస్తపర్వతము కాంతిహీనమైనది. మందరము సముద్రములో దిరిగితిరిగి గ్రుడ్డిదైనది. మలయము సర్పములతో నిండినది. రైవతకము నేతిబీరకాయ వలెనుండి ధనము లియ్యజాలదు. మిగిలిన పర్వతాలకు భూమిని భరించు సామర్థ్యములేదు. మరి నా కేమి తక్కువ?"అని పలుకగావింధ్యునిగర్వమునుగ్రహించినారదుడు, "ఇతడు శ్రీశైలాదులను గమనించినట్లు లేదు"అనుకొని అప్పటికి తగిన మాటలాడి వెళ్ళిపోయెను. వింధ్యునికి తాను తక్కువ వాడ నను (ఇన్ ఫీరియారిటీ కాంప్లెక్సు) భావము గలిగి, తన యాధిక్యమును నిరూపించుకొనవలె నను తపన గలిగెను. సూర్యచంద్రులు మేరువునకు ప్రదక్షిణము చేయుదురు. వారు నా చుట్టు దిరుగునట్లు చేసెదనని మహోన్నతముగా పెరిగిపోయెను. సూర్యుడుదయించెను. కాని రథము ముందునకు సాగలేదు. వింధ్యము అడ్డుగా నిలిచెను.నక్షత్రగ్రహసంచారము లాగిపోయినవి. అహోరాత్రముల భేధము తెలియలేదు. మునుల స్నానసంధ్యాదికృత్యములుస్తంభించిపోయినవి.బ్రహ్మాదిదేవతలయొద్దకుబోయి మునులు మొరపెట్టుకొనిరి. వారందరు ఆలోచించి మహాతపశ్శాలి యయిన అగస్త్యుడు తప్ప మరొకరు దీనికి పరిష్కారము చెప్పలేరని నిర్ణయించి అందరును గలిసి కాశీపురములో లోపాముద్రతో నివసించుచున్న అగస్త్యుని యొద్దకు వెళ్ళిరి. ఆయన, బ్రహ్మాదిదేవతలను జూచి పరమాశ్చర్యము నొంది, వారికి తగిన మర్యాదలు చేసి, "మీ రందరును నన్ను ధన్యుని జేయుటకే వచ్చినారని భావించెద"ననెను. బ్రహ్మదేవుడు ముందునకు వచ్చి, "మునీంద్రా!ఒక లోకోపకారము నీవలన కావలసియున్నది. నీవు సామాన్యుడవుకావు. గర్వాంధుడైన నహుషుని శపించి దేవలోకమును కాపాడినావు. సముద్రాల నీటిని త్రాగి కాలకేయాది రాక్షసులనుజంపుటకుతోడ్పడినావు.ఈ లోపాముద్ర రాజకుమార్తె యైనను గణన కెక్కిన మహాపతివ్రత"అని పొగడుచుండగా "విషయమేమో సెల వి౦"డని అగస్త్యుడనెను. అంతట బ్రహ్మ "చూచితివి గదా!లోకములకు గలిగిన ప్రళయము?సూర్యోదయము కాలేదు. సర్వలోకములును చీకాకు పడుచున్నవి. సూర్యచంద్రాదుల గమనములకు వింధ్యము అడ్డు వచ్చినది. నీవే వాని గర్వము నణచగల సమర్థుడవు. ఇది లోకక్షేమంకరమైన కార్యము"అని పలుకగా అగస్త్యుడు సరియే యని అంగీకరించెను.

# అష్టాదశ పురాణములు

## స్కాంద పురాణము

కాని, కాశిని విడిచి వెళ్ళవలసివచ్చుచున్నదని చాల విచారించెను. గంగలో స్నానమాడి గంగకును, విశ్వేశ్వరుని సేవించి యతనికిని, విశాలాక్షికిని, కాలభైరవునకును, ఢుండి విఘ్నేశ్వరునకును, బిందుమాధవునకును ఇతర దేవతలకును వీడుకోలు పలికి అగస్త్యుడు విచారముతో కాశిని విడిచెను. వింధ్యపర్వత సమీపమునకు వెళ్ళగానే అతడు మానుషరూపముతో ఆయనకు స్వాగతము పలికెను. "మీ రిట్లు వచ్చుటకు కారణ మేమి?"అని యడిగెను. మునీంద్రుడు "నేను దక్షిణదేశయాత్ర చేయుటకై బయలుదేరినాను. నీ మర్యాదకు సంతోషము. కాని యీమె రాజకుమార్తె. నీకు దెలియునుగదా!ఇప్పటికే ప్రయాణము చేసి అలసిపోయినది. నీ వింత యెత్తు ఎదిగినందుకు ఆనందమేకాని, మాకు ముందునకు బోవుటకు దారేది?నీవు కొంచెము తగ్గి ఆయనకు నమస్కరించి, తాను పూర్వమువలె తగ్గి దారి యిచ్చెను. ఆయన వెళ్ళుచు "మేము మరల ఈ మార్గముననే వచ్చెదము. అప్పుడు మరల నిన్ను ప్రార్థించలేను. మేము వచ్చువరకును ఇట్లే యుండుము"అని కేరి దక్షిణదిశకు వెళ్ళెను. ఆయనకొల్లాపురమునందలిశ్రీమహాలక్ష్మినిసేవించిఅక్కడినుండి దక్షారామమునందున్న భీమేశ్వరుని జూచి, అక్కడినుండి శ్రీశైలమునకు బోయి భ్రమరాంబామల్లికార్జునులను సేవించి, కాశిని విడిచి వచ్చిన దుఃఖమును విస్మరించెను. స్కందవనమును జేరి స్కందుని వలన వారణాసీ విశేషములు తెలిసికొనెను.

**జ్ఞానవాపి**

స్కందుడు అగస్త్యమునితో ఇట్లనెను. "జ్ఞానవాపీ వృత్తాంతమును చెప్పెదను. వినుము. ఒకప్పుడు భూలోకమునందు అనావృష్టి కలిగి ప్రాణులకు గొంతు తడుపుకొనుటకు గూడనీరు దొరకక అల్లాడిపోయిరి. చెరువు లెండిపోయెను. నదులలో నీళ్ళు నామమాత్ర మయ్యెను. అటువంటి సమయములో ఈశాను డను (ఇతడు ఈశాన్యదిక్పాలకుడో లేక ఒక మునియో కావచ్చును) జటాధారి ఆనందకానన మని చెప్పబడు కాశీక్షేత్రమునకు వచ్చెను. అక్కడ ఆయన విశ్వేశ్వరలింగమును జూచి అభిషేకము చేయవలెనని సంకల్పించెను. కాని ఎక్కడను నీళ్ళు దొరకలేదు. అప్పు డీశానుడు తన చేతిలోని త్రిశూలముతో ఆలయమునకు దక్షిణమువైపున త్రవ్వెను. ఆ కుండమునుండి ప్రచండవేగముతో జలము పై కుబికి వచ్చెను.దానితో కాశీనగర మంతయు జలసంపూర్ణ మయ్యెను. ఆ జలముతో ఈశానుడు విశ్వేశ్వరునికి తనివితీర అభిషేఖము చేసెను.

దానితో విశ్వేశ్వరుడు సంతుష్టుడైఈ శానునితో నిట్లనెను,"నీవు చేసిన ఈయభిషేకమునకు చాల సంతుష్టుడ నైతిని. వర మిచ్చెదను కోరుకొమ్మ"నెను. ఈశానుడు "స్వామీ!నాకు నీవు వర మియ్య దలచినచో, ఈ తీర్థము నీ పేరుమీదుగా ప్రసిద్ధికెక్కునట్లు వరమిమ్ము"అని ప్రార్థించెను. విశ్వనాథుడు "త్రిలోకములలో నున్న తీర్థములకంటె ఈ తీర్థము శ్రేష్ఠమై యుండును. ఇది శివతీర్థమని ప్రసిద్ధి నొందును. శబ్దార్థవేత్తలు"శివ"మనగాజ్ఞానమని చెప్పుదురు. అది ఇక్కడ ద్రవరూపముగా వెలసినది కాన "జ్ఞానతీర్థ"మని చెప్పబడును. అది గల వాపి (నూయి) జ్ఞానవాపి. ఈ తీర్థమును స్పృశించినను ఆచమనము చేసినను అశ్వమేధఫలము లభించును. ఏకాదశినాడు ఉపవాసముచేసి యీ తీర్థమును మూడుసార్లు పుచ్చుకొని ఆచమించినచో అతని హృదయములో శివుడు జ్ఞానదీపమై ప్రకాశించును. ఇది సర్వరోగములు హరించును. ఇక్కడ పిండప్రదానము చేసినచో పితృదేవతలు తరించెదరు. ఈ తీర్థముతో విశ్వేశ్వరుడ నైన నన్ను అభిషేకించినచో సర్వతీర్థములతో అభిషేకించిన ఫలము కలుగును. ఈ తీర్థమును భక్తితో సేవించినవారికి జ్ఞానోపదేశము చేయుదు"నని చెప్పగా ఈశానుడు పరమసంతోషమును బొందెను.

**అష్టవిధ వివాహములు**

మానవలోకములో వివాహములు ఎనిమిది విధములుగా నుండును.

1. బ్రాహ్మము, 2. దైవము, 3. ఆర్షము, 4. ప్రాజాపత్యము, 5. ఆసురము, 6. గాంధర్వము, 7. రాక్షసము, 8. పైశాచము.

1. బ్రాహ్మము : యోగ్యుడైన వరుని బిలిచి అలంకరిన కన్యను ఇచ్చి చేయు వివాహము బ్రాహ్మము. ఈ దంపతులకు బుట్టిన కొడుకు ఇరువది యొక్క తరములవారిని తరింపజే యును. ఇది సాధారణముగా ఇండ్లలో జరుగునదే.

2. దైవము : యజ్ఞమునందు ఋత్విజుడుగా వచ్చిన బ్రహ్మచారికి కన్య నిచ్చి చేయు వివాహము దైవము. వీరికి బుట్టిన కుమారుడు పదునాలుగు తరములవారిని పవిత్రులను జేయును.

3. ఆర్షము : వరుని యొద్దనుండి రెండు గోవులను కన్యాశుల్కముగా గ్రహించి, కుమార్తె నిచ్చిచేయువివాహము,ఆర్షము.వీరికుమారుడుఆరుతరములవారినిపవిత్రులను జేయును.

4. ప్రాజాపత్యము : మీ రిద్దరును దంపతులై గృహస్థధర్మమును నిర్వర్తింపుడని వధూవరులను దీవించి చేసిన వివాహము ప్రాజాపత్యము. వీరి కుమారుడు ఆరు తరములవారిని నుద్ధరించును.

5. ఆసురము : వధువు ఇష్టానిష్టములతో నిమిత్తములేకుండ, వరుని యొద్దనుండి ధనము తీసికొని కన్యను విక్రయించి చేయు వివాహము ఆసురము.

6. గాంధర్వము : వధూవరులు యుక్తవయస్కులై ఒకరిని జూచి యొకరు ఇష్టపడి, పెద్దలయనుమతి లేకుండ పంచభూతముల సాక్షిగా చేసికొను వివాహము గాంధర్వము. కలియుగములో సత్యము క్షీణించినది కావున ఈ వివాహము నిషేధింపబడినది. పూర్వము శకుంతలా దుష్యంతులు ఈవిధముగానే దంపతులైరి.

7. రాక్షసము : వధూవరులకు పరస్పరము ఇష్ట ముండును. పెద్ద లనుమతింపరు. అప్పుడువరుడుతన భుజబలముతో వారిని గెలిచి కన్యను దెచ్చుకొని వివాహమాడునది రాక్షసము. పెద్ద లిట్టి వివాహములను తరచుగా సమ్మతింపరు. శ్రీకృష్ణుడు రుక్మిణిని ఈవిధముగానే చేపట్టెను.

8. పైశాచము : కన్యకు గాని ఆమె వైపువారికి గాని యిష్ట ముండదు. ఐనను వరుడు బలాత్కారముగా కన్య నెత్తుకొని పోయి చేసికొను వివాహము పైశాచము. దీనిని పెద్ద లందరును గర్హింతురు.ఈ పై యెనిమిది వివాహములలో మొదటి నాలుగును బ్రాహ్మణులకు యోగ్యమైనవి. గాంధర్వరాక్షసములు రాజులకును వైశ్యులకును దగినవి. తనధర్మపత్నియందుఋతుకాలములందు సంగమము చేయువాడు సదా బ్రహ్మచారిగా పరిగణింపబడును. పగటి కాలములందును, తల్లిదండ్రుల శ్రాద్ధదినములందును, సర్వపర్వములందునుస్త్రీసంగమముచేయరాదు.చేసినచోధర్మమునుండిపతితుడగును. దానివలన అధోగతులు గలుగును. కన్యల నమ్ముకొని ఆ ధనముతో జీవించువాడు ఒక కల్ప పర్యంతము నరకములో నుండి పురుగులను ఆహారముగా తినుచుండును. వాడే కాక వాని పూర్వులను గూడ నరకములో బడవేయును. తన భర్తతో సంతుష్టి పడిన పతివ్రతయును,తనధర్మపత్నితో సంతుష్టి నొందెడు భర్తయును ఏ గృహమం దుండునో, అచ్చట శ్రీ మహాలక్ష్మి, నారాయణునితో, సహ నివసించి శుభములు గలుగజేయును.

గృహస్థులకు నిత్యము పంచసూనములతో (ఐదు విధములైన జీవుల వధ్యస్థానములు) పనియుండును. అవి కండని స్రోలు, పేషణి స్తిరుగలి, లేదా సన్నికల్లు,చుల్లీ స్పొయ్యి,

# అష్టాదశ పురాణములు

## స్కాంద పురాణము

ఉదకుంభః నీడి కడవ, మార్జనీ చీపురు కట్ట. ఈ ఐదింటిని గృహస్థులు వాడక తప్పదు. వాడునప్పుడు వారికి తెలియకుండ కొంత జీవహింస జరుగ వచ్చును. ఈ పాపమును బోగొట్టుకొనుటకేవెనుకచెప్పినపంచమహాయజ్ఞములనుగృహస్థులుచేయుచుండవలెను. వానితో పాపపరిహార మగును.

### కొన్ని సాధారణ ధర్మములు

అశ్వత్థ వృక్షముగాని, రచ్చబండమీది చెట్టుగాని, గురువు గాని, నీటి కడవ గాని, అన్నరాశిగాని, పెరుగు - పాల కడవలు గాని కనబడినప్పుడు వానికి ప్రదక్షిణము చేయవలెను. భార్యతో సహపంక్తిని భుజింపరాదు. భోజనము చేయుచున్న స్త్రీని చూడరాదు. ఒక్క వస్త్రము ధరించి భుజింపరాదు. అగ్నిని నోటితో ఊదకూడదు. నిద్రపోవుచున్న వారిని లేపకూడదు. సంధ్యాకాలములందు ఏ పదార్థమును తినకూడదు. సంధ్యాకాలములందుపండుకొనినిద్రింపకూడదు. నిలిచి యుండి మలమూత్రవిసర్జనము చేయరాదు. నీటిలో మలమూత్రములు విడువరాదు. ఒంటరిగా ప్రయాణము చేయరాదు. ఇతరులు కట్టి విడిచిన బట్టలు ధరింపరాదు. చెప్పులు కూడ ఒకరివి తొడుగరాదు. ఇతరుల ఎంగిలి తినకూడదు. రాత్రిపూట పెరుగుతో అన్నము తినరాదు.శూద్రాదులకు వేదమంత్రములు వినిపించరాదు. వినిపించిన బ్రాహ్మణుడును, వినిన శూద్రుడును ధర్మభ్రష్టులై పాపము నొందుదురు. చిరకాలము జీవించగోరువాడు, గోవుమీద స్వారి చేయగూడదు. ప్రేతధూమము (వల్లకాటి పొగ) నాఘ్రాణించరాదు. ఉదయ సూర్యుని యెండలో గూర్చుండరాదు. సత్యము చెప్పవలెను. అది కూడ ప్రియమైనప్పుడే చెప్పవలెను. అనగా, ప్రియముగా నున్నమాట చెప్పవలెను. ప్రియముగా నుండును గదా యని అసత్యము చెప్పరాదు. ఓ అగస్త్యమునీ!ఇది సనాతనమైన ధర్మము.

శ్లో॥ సత్యం బ్రూయా త్ప్రియం బ్రూయా<br>
న్న బ్రూయా త్సత్య మప్రియం<br>
ప్రియం చ నానృతం బ్రూయా<br>
దేష ధర్మో ఘటో ద్భవ ! ( స్కందః)

పెద్దలు వచ్చినపుడు లేచి తన పీఠమును వారి కియ్యవలెను. పెద్దలముందు కాళ్ళుచాపి కూర్చుండుట, పరుండుట పనికిరాదు.పెద్దలను ప్రత్యక్షముగా గాని పరోక్షమున గాని నిందింపరాదు. ఎదుటి వారిని స్తుతించుట, ఆత్మనింద పనికిరావు.

# అష్టాదశ పురాణములు

## స్కాంద పురాణము

శ్లో॥ శ్రద్ధయా ప్రతిగృహ్ణాతి శ్రద్ధయా యః ప్రయచ్ఛతి
స్వర్గిణౌ తావుభౌ స్యాతాం పతతో శ్రద్ధయా త్వధః ॥

తా. దానము ఇచ్చువాడును, పుచ్చుకొనువాడును శ్రద్ధ గలవారైనపుడు ఇద్దరికి స్వర్గసుఖము గలుగును. శ్రద్ధ లేనిచో పతనము చెందుదురు.వేదవిద్యను శిష్యులకు దానముచేయుట వలన బ్రాహ్మణుడు బ్రహ్మలోకమును బొందును. అసత్య మాడినచో, చేసిన పూజల ఫలము నశించును. గర్వము వల్ల తపము నాశన మగును. పదిసార్లు పొగడుకొనుటవలన తానిచ్చిన దానము వలని ఫలము నశించును. బ్రాహ్మణుని దూషించినచో ఆయుర్దాయము నశించును.

**వ్యాసుడు కాశిని శపింపబోయి భంగపడుట**

ఒకప్పుడు వ్యాసుడు శౌనకాది మహామును లుండెడి నైమిశారణ్యమునకు వచ్చెను. వేదములువిభజించినవాడనియు,పురాణములురచించినవాడనియు వ్యాసునియందున్న గౌరవముతో మునులు ఆయనకు మర్యాదలు చేసిరి. అప్పుడా మునుల మధ్య ముక్తి నిచ్చెడివాడు విశ్వేశ్వరుడా?లేక విష్ణుమూర్తియా యని చర్చజరుగుచుండెను.ఆ మును లందరును చివరికి విశ్వేశ్వరు డొక్కడే ముక్తిదాత. మరొక డెవ్వడును కాదనిరి. అప్పుడు వ్యాసుడు లేచి చేయి పైకెత్తి, "ఇదిగో, నేను చెప్పుచున్నాను వినుడు. వేదములందును, రామాయణభారతములందును,పురాణములందునువర్ణింపబడినవాడొక్కవిష్ణుమూర్తియే. అతడేసృష్టిస్థితిలయములకుకారణభూతుడైనయాదిపురుషుడు.కావునఅతడే మోక్షదాత. శివుడు కాడు"అని నిష్కర్ష చేసెను. అది విని ముని లందరును ఆశ్చర్య మొంది, "మహానుభావా!నీవు సర్వజ్ఞుడవు. నీకంటెను తెలిసినవా రెవ్వరున్నారు?అయితే, నీ విప్పుడన్న మాటలు కాశిలో విశ్వేశ్వర సన్నిధిలో చెప్పినచో మాకు ఆనందము కలుగును"అనిరి. వ్యాసు డంగీకరించి తన పదివేలమంది శిష్యులతోను, మునులతోను కాశికి వెళ్ళెను. అక్కడ పంచనదనమున స్నానము చేసి బిందుమాధవుని భక్తితో సేవించి

**శ్లో॥ సహస్రశీర్ష పురుష పురుహూత సుఖప్రద ।**
**యద్భూతం యచ్చ భావ్యం వై తత్త్వైకః పురుషో భవాన్॥**

అనుచు స్తోత్రములు చేసెను. తరువాత నృత్యగీతవాద్యములతో మాధవుని సేవించెను. ఆ పిమ్మట మాధవు డొక్కడే మోక్షదాత యని చేయెత్తి చాటెను.

అతని చేయి ఎత్తినట్లే స్తంభించిపోయెను. మాటలుగూడ స్తంభించిపోయెను. అప్పుడు మాధవుడు వచ్చి, "ఓయి వ్యాపా!ఎంత తప్పు చేసినావు?

**ఏక ఏవ హి విశ్వేశో ద్వితీయో నాస్తి కశ్చన,**

**తత్ప్రసాదా దహం చక్రీ లక్ష్మీశస్తత్ప్రభావతః ॥**

**త్రైలోక్యరక్షా సామర్థ్యం దత్తం తే నైవ శంభువా।**

ఈ విశ్వమునకు ఈశ్వరు డత డొక్కడే. వేరొకడు లేడు. ఆయన దయవల్లనే నేను చక్రినైనాను. లక్ష్మీశుడ నైనాను. త్రైలోక్యమును రక్షించు సామర్థ్యము అతని వలననే నాకు గలిగినది. నీవు శుభమును గోరినచో శంకరుని స్తుతింపుము"అనగా వ్యాసుడు తన కంఠమును తాకు మని సన్న చేసెను. విష్ణువు అట్లు చేయగా నందివలన స్తంభించిన వాక్కును,అంగములునుతిరిగిస్వాధీనములోనికివచ్చెను.అప్పుడువ్యాసుడుశ్రీమహాదేవుని పరిపరివిధములస్తుతించెను.(వ్యాసకృతశివాష్టకము,పుణ్యప్రదము,శివసాన్నిధ్యకారణము. కాశీఖండే 95 అధ్యాయః) తరువాత వ్యాసుడు, " లింగే ష్వేకో హి విశ్వేశ, స్త్రీర్థేషు మణికర్ణికా "అని చాటుచు నిత్యము స్నానముచేసి ముక్తిమండపములో గూర్చుండి శిష్యులకు విశ్వేశుని దివ్యమహిమలును, వేద పాఠములును చెప్పుచు గడుపుచుండెను. ఒకనాడు విశ్వనాథుడు అన్నపూర్ణతో "వ్యాసునికి భిక్ష దొరకకుండ జేయు"మని చెప్పెను. ఆమె కాశియందలి సర్వగృహిణుల హృదయముల యందును ఆవేశించి, వ్యాసుడును, శిష్యులును భిక్షకు వచ్చినపుడు ఏదో వంక చెప్పి భిక్ష పెట్టకుండ జేసెను. ఆనాడు శిష్యులతో వ్యాసుడు ఉపవాసము చేసెను. మరునాడు యథాప్రకారముగా భిక్షకు బయలుదేరెను. వ్యాసునికిగాని, శిష్యులకుగాని యే యింటను భిక్ష దొరుకలేదు. వ్యాసుడు శిష్యులతో "మనకు నిన్న ఈనాడు కూడ భిక్ష దొరకకపోవుటకు హేతువు ఏమై యుండును?మిగిలినవారికి లభించుచున్నది గదా!మనకు మాత్రమే యేల లభింపదు? ఎవరైన అడ్డు పడినారా?విచారించి రండ"ని పంపగా వారు వెళ్ళి వచ్చి "గురుదేవా! అందరును క్షేమముగానే యున్నారు. ఎవరికిని దారిద్ర్యము లేదు. ఎవరును అడ్డు పడలేదు. అందరును ధర్మపరాయణులే. అందరును శ్రీవిశ్వేశ్వరారాధకులే.మనకు భిక్ష లభింపనందుకు కారణము మాత్రము తెలియ రాలేదు"అని విన్నవించిరి. అంతట వ్యాసుడు, "కాశి సర్వవిద్యలకు నిలయము, లక్ష్మీనివాసము.ముక్తి క్షేత్రము. అందుచేతనే ఇచటి వారు గర్వించి మనకు భిక్ష పెట్టినారు కారు"అనుచు క్రోధాంధుడై

" మా భూ త్త్రైపూరుషీ విద్యా మా భూ త్త్రై పూరుషం ధనం,
మా భూ త్త్రైపూరుషీ ముక్తిః కాశ్యాం నివసతాం నృణామ్ "
(కాశిలో నివసించువారికి మూడుతరాల వరకును విద్య, సంపద, ముక్తి లేకుండునుగాక.) అని శపించెను. శాప మిచ్చిన తరువాత కూడ మరల భిక్షకై వీథివీథియు తిరిగెను. కాని భిక్ష లభింపలేదు. కోపముతో చేతిలోని భిక్షాపాత్రను నేలమీద పగులగొట్టి ఆశ్రమమునకు బోవుచుండగా ఒక యిల్లాలు వ్యాసుని బిలిచి, "మునీంద్రా!నా భర్త వృద్ధుడు. ప్రతిదినము అతిథులకు బెట్టకుండ తినడు. ఈనాడు ఎవరును అతిథులు రాలేదు. ఆయన భుజించకుండ కూర్చున్నాడు. మీరు అతిథులుగా దయచేయు"డని పిలిచెను. వ్యాసు డామెను జూచి యాశ్చర్యపడి, "అమ్మా!నిన్న, ఈనాడు కాశిలో మా మొగము చూచినవారు లేరు. నీవు భోజనమునకు బిలిచినావు. సంతోషము. నే నొక్కడను కాను. నాకుపదివేలమందిశిష్యులున్నారు.వారునునావలెనేఆకలికితట్టుకొనలేకున్నారు"అనెను. ఆ ముత్తైదువ "అట్లైనచో మీరందరును భోజనమునకు రండు. ఆలస్యము చేయకూడదు"అనగా వారందరును సంతోషపడి వచ్చిరి. పాదప్రక్షాళన చేసికొని అందరును కూర్చుండిరి. వడ్డించిన పదార్థములు చూడగానే, ఆ వాసనతోనే వారికి చాల సంతృప్తి కలిగినది. కడుపులు నిండునట్లు వ్యాసుడును, శిష్యులును భుజించిరి. కాళ్ళు, చేతులు కడుగుకొని యాచమించి ఆ యిల్లాలిని దీవించి బయలుదేరుటకు సిద్ధపడిరి. అపుడా యిల్లాలు వ్యాసునితో, "తీర్థవాసులకు ముఖ్య ధర్మమేది యని మా భర్త యడుగుచున్నా"డని పలికెను. వ్యాసుడు, "తల్లీ!అల్పజ్ఞుడను. నే నేమి చెప్పగలను. అన్నియు నీకు తెలియును. అడిగితివి కనుక చెప్పుచున్నాను. ఆకలి గొన్నవారికి అన్నము పెట్టుటకన్నను, తిన్నవారు అన్నదాతకు సంతోషము కలిగించుటకన్నను ఉత్తమధర్మము లేదు"అనెను. ఆమె "అదే ధర్మ మైనచో యథాశక్తిగా చేయుచున్నాము. నీవు సామాన్యధర్మములను జెప్పు"మనెను. అపుడు వ్యాసుడు, "ఎవరిని నొప్పించకుండ మాటలాడుట, ఇతరుల ఉన్నతిని జూచి యీర్ష్యపడకుండుట,ఆలోచించి పనిచేయుట, తానున్న స్థానము వృద్ధినొంద గోరుట అనునవి ప్రతి మానవునకును సామాన్యధర్మములు"అని చెప్పెను. అది విని వృద్ధ గృహస్థుడు "మునీంద్రా!ఈ ధర్మములలో నీ యందున్న వెన్ని?"అని ప్రశ్నించగా వ్యాసుడు నిశ్చేష్టుడై చూచెను. మరల ఆయన ఇట్లనెను.

# అష్టాదశ పురాణములు

## స్కాంద పురాణము

"ఈ ధర్మములు చెప్పుటకు నీవే అర్హుడవు. నీకన్న మృదువైన మాటతీరును, ఆలోచించి పనిచేయుస్వభావమును,ఉన్నయింటికిమేలుగోరుతత్వమును,ఇతరులయౌన్నత్యమును సహించు శాంతస్వభావమును మరెవ్వరి కుండును?మహానుభావుడవు గనుక నీవు చెప్పగలవు;చెప్పినవి ఆచరించగలవు కూడ"అని వ్యంగ్యముగా మాటలాడెను. అంతటితో ఊరకుంటక "నీకు నీ అభాగ్యమువలన భిక్ష దొరుకలేదు. దానికి పురవాసుల దోష మేమున్నది?ఎందుకు వారిని వృథగా శపించినావు?ఇది నా రాజధాని. దీనిపై నీవంటి వారి శాపములు పనిచేయవు. నీవంటి క్రోధనుడు మహాపుణ్య క్షేత్రమైన కాశిలో నివసించుట కర్హుడు కాడు. వెంటనే ముక్తి క్షేత్రమైన కాశిని వదలి పొమ్ము. ఈ కాశిపై ఎవ్వ డైనదుర్మార్గముచూపినచోవాడురుద్రపిశాచమగును"అనికఠినముగా మాటలాడెను. అదివిని వ్యాసుడు గడగడవణకుచు వారిపాదములపై వ్రాలి జగన్మాతతో," తల్లీ!నేను అనాథుడను,అవివేకిని,నిన్నే శరణు పొందినాను. రక్షింపుము. నీ కుమారునివంటివాడను. విశ్వనాథుని శాపమునుండి నన్ను కాపాడుము. కాశిని విడిచి నేను బ్రతుకలేను. ప్రతి అష్టమినాడును, ప్రతి మాసశివరాత్రినాడును నాకు కాశీప్రవేశమునకు అనుమతి దయచేయుము"అని దీనముగా ప్రార్థించెను. ఆ జగన్మాత కరుణామూర్తియై, తన భర్త మొగము వంక చూచెను. తరువాత వ్యాసునితో "నీ కోరిక తీరునులె"మ్మని పలికెను. ఆ దంపతు లంతర్ధాన మొందిరి. వ్యాసుడు వెంటనే కాశిని విడిచి గంగకు తూర్పుతీరమున నివసించుచు నిత్యము కాశీనగరమువైపు చూచి నిట్టూర్చుచు తన దురదృష్టమును నిందించుకొనుచుండెను.అప్పుడతడునివసించినదే"వ్యాసకాశి".యాత్రలకువెళ్ళినవారు, వ్యాసేశ్వరుని దర్శించుకొని వెంటనే తిరిగి వచ్చెదరు. వ్యాసకాశిలో నివసింపరు.

అగస్త్యునకు స్కందుడీ కథ చెప్పి, "మునీశ్వరీ!కాశికి శుభము గోరువారి కెల్లప్పుడును శుభములే కలుగును"అని చెప్పెను.

### ఇంద్రద్యుమ్నుడు

పూర్వ మింద్రద్యుమ్నుడను మహారాజు అనేక యజ్ఞములు చేసెను. ఆయన చేసిన యజ్ఞముల దర్భలతో భూమి రెండంగుళముల యెత్తు పెరిగినది. యజ్ఞాగ్నిహోత్రముల వేడికి భూమి ఉడికిపోయి, లోపలినుండి జలము ధారగా పైకి పొంగివచ్చెను. అదే మహీనది యను పేరు పొందెను.

# అష్టాదశ పురాణములు

## స్కాంద పురాణము

ఇంద్రద్యుమ్నుడుదేహముచాలించిస్వర్గమునకు బోయి భోగము లనుభవించుచుండెను. కొన్ని కల్పములు గడచెను. ఒకనాడు బ్రహ్మ ఇంద్రద్యుమ్నుని బిలిచి, "నీకు స్వర్గసుఖానుభవముచే పుణ్యము చెల్లిపోయినది. పుణ్యహీనులు స్వర్గమందుండుటకు వీలులేదు. నీ పుణ్యమును దిరిగి సంపాదించుకొని ర"మ్మని చెప్పెను. అతడు "నేను పుణ్య మెట్లు సంపాదింపవలె"నని యడుగగా "భూలోకములో నిన్నుగూర్చి ప్రశంసించువారున్నచో ఆ కీర్తి వలన నీవు పుణ్యమును బొందినట్లే. వెళ్ళి విచారించి ర"మ్మని పంపెను. పూర్వము తాను పరిపాలించిన కాంపిల్య నగరమునకు వచ్చెను. అంతయును క్రొత్తగా నుండెను. "ఇంద్రద్యుమ్నుడను రాజు పూర్వమీ నగరమును పాలించినాడు. అతనిని గూర్చి మీకు తెలియునా?"అని అందరిని అడిగెను. వారు తెలియదు కాని సప్తకల్పముల ఆయుర్దాయముగల మార్కండేయు నడుగు"మనిరి. రాజు మార్కండేయుని వెదుకుకొనుచు బోయి, అతనికి నమస్కరించి "ఇంద్రద్యుమ్నుని గూర్చి మీరేమైన చెప్పగలరా?"యని యడిగెను. ఆయన "నాకు తెలియదుకాని నాకు మిత్రమైన ఒక బకము గలదు. అది నాకంటెను చాల పెద్దది. అది చెప్పగలదు ర"మ్మని తీసికొని వెళ్ళెను. నాడీజంఘుడను ఆ బకము వారికి మర్యాదలు చేసి "నాకు పదునాలుగు కల్పములు గుర్తున్నవి. కాని యింద్రద్యుమ్నుని గూర్చి వినలేదు"అనగా రాజును,మార్కండేయుడునునిరుత్సాహపడిరి.రాజు"నేనుపుణ్యహీనుడనైబ్రహ్మదగ్గరకు వెళ్ళి మరల అతనిచే పొమ్మనిపించుకోలేను. అగ్నిప్రవేశము చేసెద"ననగా బకము రాజా!నాకంటె వృద్ధమైన ప్రాకారకర్ణుడను గ్రుడ్లగూబ కలదు. దాని నడుగుదమని ఈ ముగ్గురును వెళ్ళి అతనిని జూచి యింద్రద్యుమ్నుని గూర్చి యడిగిరి. ఆ గూబ "మిత్రులారా!నేను పుట్టియిరువది యెనిమిది కల్పము లైనది.ఆ రాజునుగూర్చివినలేదు. కాని నాకన్న వృద్ధమైన గ్రద్ద యొకటి గంధమాదనపర్వతముమీద నున్నది. దాని నడుగుద"మని వారితోగూడ బయలుదేరి గ్రద్ద యొద్దకు వచ్చి ఆ రాజును గూర్చి యడిగెను. ఆ గ్రద్ద, "నే నా రాజును గూర్చి విని యుండలేదు. కాని నాకంటె పెద్దదైన మంథరకుడను తాబేలున్నది. దాని నడుగుద"మని చెప్పుచు, తాను గూడ వారితో మంథరకుని యొద్దకు వెళ్ళెను. మంథరకుడు వీరిలో రాజును జూచి నీటి లోనికి పారిపోగా వారు అతనిని బిలిచి, మిత్రులకు మర్యాద చేయకుండ బోవుచున్నావేమి? "అని యడుగగా అతడు, "నే నీ రాజును జూచి భయపడి పారిపోవుచున్నాను.

# అష్టాదశ పురాణములు

## స్కాంద పురాణము

విశాలమైన బొరుసు కలిగియున్నందున నన్నీతడు అనేక యజ్ఞములలో వేదికగా నుపయోగించుకొనెను.ఇప్పటికినిఆకాలినపుండుమానలేదు. మరల నన్ను యజ్ఞవేదికగా వాడుకొనుటకువచ్చినాడేమోయనిభయపడినాను.అంతేకానిఅతిథి మర్యాదలు తెలియక కాదు"అనగానేఇంద్రద్యుమ్నునికొఱకుదేవలోకమునుండివిమానమువచ్చెను.దేవదూతలు రాజునాహ్వానించిరి.రాజు,"నామిత్రులైనవీరినందరినిగూడనాతోరానిచ్చినచోస్వర్గమునకు వచ్చెద"ననెను. వారు "రాజా!వీరందరును శివారాధనము చేసి ప్రమథగణములలో చేరిపోయినవారు. కర్మవశమున శాపగ్రస్తులై యిట్లున్నారు. శాపములు తీరగానే వీరు శివసన్నిధికిచేరుదురు.నీవు రమ్ము. పోవుద"మనిరి.రాజు ఆ మాటలు విని "ఆలాగుననా! వీరు శివారాధనము చేసి శాశ్వతస్థానమునొందినారా?నేనుగూడఅట్టి శాశ్వతస్థానమునేల సంపాదింపరాదు?స్వర్గమునకు బోయినచోకొంతకాలమునకు నీ పుణ్యము క్షీణించినది కావునపొమ్మందురు.అట్లుఅనిపించుకొనుటెందుకు?మిత్రులారా!నాకుగూడశివారాధనము చేసిమోక్షమునొందుమార్గముపదేశింపు"డనిపలికి,వచ్చినదేవవిమానమునుపంపివేసెను. తరువాతమంధరకునిమాటపై వారందరును గలిసి మాళవదేశములో నున్న సంవర్తుడను మహామునిదగ్గరకేగిరి.శ్రమపడిఆయనదయసంపాదించిరి.ఆయన "ఈ ఇంద్రద్యుమ్నుని యాగముల వలన ఉడికిన భూమినుండి పొంగిన మహానది ఇదే. ఇది తీర్థములలోని కెల్ల మహా మహిమ కలది.నేను ఏబదియారు కల్పములనుండి యీ నదీతీరమున తపము చేసికొనుచుంటిని.మీరునుఈనదిలో స్నానమాడి శివుని సేవింపుడు. మీకు ఉత్తమగతులు కలుగు"ననిబోధింపగావారతనినిగురువుగాభావించిస్నానముచేసి,శివునిఆనదీజలములతో అభిషేకించుచుశివునియనుగ్రహమును సంపాందించిరి.ఇంద్రద్యుమ్నుడక్కడ మహాకాళేశ్వరుడను పేర ఒక శివలింగమును ప్రతిష్ఠించి పూజించెను. ఆ రీతిగా వారు చేసినశివార్చనములవలనశాశ్వతముగాశివలోకమును బొందిరి. నాడీ జంఘాదులకు శాపములు తొలగెను.వారుగూడప్రమథగణములలోవారివారిస్థానములనుబొందిరి.శివార్చనముసకల శ్రేయోదాయకము. అంతేకాదు. స్వర్గాది భోగములు తాత్కాలికములు. "క్షీణే పుణ్యే మర్త్యలోకంవిశంతి"(పుణ్యము తరిగిపోగానే స్వర్గమునుండి జారి భూమిలో బుట్టుదురు) అని గీతావచనము అట్టి స్వర్గసుఖములకంటె శాశ్వతమైన మోక్షమును బుద్ధిమంతుడు కోరవలెను.

ఇది స్కాందపురాణము